# రామగీత



ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆరోగ్య, ధర్మశాస్త్రాది అనేక విషయాలు తెలుసుకోండి...

శ్రీకృష్ణ శరణం మమః

# శ్రీ రా మ గీ త

ఉపోద్ఘాతము

వేదవ్యాస విరచితమైన అధ్యాత్మ రామాయణంలోని ఉత్తరకాండ 5వ అధ్యాయములో 62 శ్లోకాలతో కూడిన శ్రీరామగీత కనిపిస్తుంది. పౌరాణిక శైలిలో ఇది రచింపబడింది. సుప్రసిద్ధమయిన ఈ శ్రీరామగీత శ్రుతిసార సంగ్రహమని కూడా తరచుగా పిలవబడుతుంది.

అన్నగారి మాటలకు ఎదురుచెప్పలేక, బాధాకరమైన తన విధిని నిర్వర్తించి తిరిగి వచ్చి, లక్ష్మణుడు అసందిగ్ధమయిన ఆలోచనలతో, ఛిన్నాభిన్నమయిన మనస్సుతో, కృంగి కృశిస్తూ కాలాన్ని గడుపుతున్నాడు. సందేహిస్తూనే ఒక రోజు రాములవారిని సమీపించి నైతిక ధర్మాల గురించి ప్రశ్నించాడు. పరిపూర్ణ తత్త్వవేత్త అయిన శ్రీరాముడు జవాబుగా ఇచ్చిన సందేశమే శ్రీరామగీత అనబడుతోంది.

తాత్త్వక సత్యాలను కథల ద్వారా సూచిస్తూ వ్యక్తుల సంభాషణల ద్వారా వివరించడం పురాణాలకు సహజమైన శైలి. శ్రీరామ గీతలో, అమాయకురాలూ, గర్భవతీ అయిన సీతామహాసాధ్విని అడవులకి పంపిన తర్వాత శ్రీరాముడే విధంగా ఉన్నాడని పార్వతీ దేవి పరమేశ్వరుని ప్రశ్నిస్తుంది. అందుకని భగవద్గీతలో కృష్ణార్జునుల సంవాదాన్ని ధృతరాష్ట్రుడు ప్రశ్నించగా సంజయుడు చెప్తున్నట్లుగా చిత్రించినట్లు, రామలక్ష్మ ణుల సంవాదాన్ని పార్వతీ పరమేశ్వరుల మధ్య సంభాషణల ద్వారా చిత్రించారు వేదవ్యాసులు.

శ్రీ మహాదేవ ఉవాచ:

తతో జగన్మంగల మంగలాత్మనా

విధాయ రామాయణకీర్తి ముత్తమామ్ ।

చచార పూర్వాచరితం రఘూత్తమో

రాజర్షివర్యైరభిసేవితం యథా ॥ 1

1. తతః శబ్దం పురాణాల్లో చాలాచోట్ల కనిపిస్తుంది. తతః అంటే ఆ తర్వాత పార్వతి ప్రశ్నచే ప్రేరితుడైన పరమశివుడు అత్యంత ఉత్సాహంతో శ్రీరాముని గురించి చెప్తున్నాడు. ఆ తర్వాత అంటే, సీతని అడవులలో వదిలిన తరువాత, రఘువంశోత్తముడు, రామాయణ కీర్తి పాత్రుడు, జగన్మంగళరూపుడు అయిన శ్రీరామచంద్రుడు, రాజరికం, భోగైశ్వర్యాల మధ్య జీవిస్తూ, తన పూర్వీకుల వలెనే జపతపాదులని అత్యంత నిష్ఠతో అనుష్ఠిస్తూ రాజర్షి వలె జీవిస్తున్నాడని అంటాడు.

'రమతే సర్వభూతేషు, స్థావరేషు చరేషుచ' అంటే చరాచరములన్నిటిలోనూ క్రీడించునది. అదే ఆత్మ అని, రామచంద్రుని పేరు ఈ 'రమ' లోంచి గ్రహించబడింది. మొదటి శ్లోకంలోనే రాముడు పరమాత్మ అని చెప్పినట్టయింది.

శ్లో॥ సౌమిత్రిణా పృష్ట ఉదార బుద్ధినా
రామఃకథాః ప్రాహ పురాతనీః శుభాః ।
రాజ్ఞః ప్రమత్తస్య నృగస్య శాపతో
ద్విజస్య తిర్యక్త్వ మథాహ రాఘవః ॥ 2

2. తన సంభాషణను కొనసాగిస్తూ మహాదేవుడు, తన మనోనేత్రంతో రాజ ప్రసాదంలో జరుగుతున్న విషయాలను చూస్తున్నట్లుగా వర్ణిస్తున్నాడు. జీవితంలో అనుసరించవలసిన అతి ముఖ్యమయిన విలువలని నొక్కి చెప్పేటటువంటి పురాతన మయిన కథలనూ, ఏవిధంగా ఒక్కొక్కప్పుడు ఘోరంగా మనుజులు పతనాన్ని, అన్యాయాన్నీ తప్పించుకోలేని, ఎదుర్కోలేని పరిస్థితులలో పడిపోక తప్పదో రాముడు చెప్తున్నాడు.నృగరాజు ఏ పాపమూ చేయకపోయినా కఠిన శిక్షననుభవిస్తాడు. ఒక ఊసరవెల్లిగా జన్మిస్తాడు. రాముడు ఈ కథని నొక్కిచెప్పినట్లుగా కనిపిస్తుంది, నృగరాజుకీ, తనకీ ఉన్న సామీప్యంవల్ల నిర్దోషి అయిన శ్రీరాముడు ప్రస్తుతం అనుభవిస్తున్న బాధలాంటిదే నృగరాజుది కూడా.

శ్లో॥ కదాచిదేకాంతా ఉపస్థితం ప్రభుం
రామం రమాలాలిత పాదపంకజమ్ ।
సౌమిత్రిరాసాదిత శుద్ధ భావనః
ప్రణమ్య భక్త్యా వినయాన్వితో బ్రవీత్ ॥ 3

3. ఎవని పాదములను లక్ష్మీదేవి నిరంతరమూ సేవిస్తుందో, అట్టి శ్రీరామచంద్రుడు ఒకరోజు రాజకార్యభారాలూ, తపోసాధనలూ లేకుండా శాంతంగా ఏకాంతలో ఉద్యానవనంలో కూర్చొని, సాయం సంధ్యా సమయంలో చెట్లమీద నివాసం ఏర్పరచుకుంటున్న పక్షుల కిలాకిలారావాలు వింటూ ఉన్నప్పడు అనుంగు సోదరుడైన సుమిత్రానందనుడు (లక్ష్మణుడు) సమీపించి, వినయంతో ప్రణమిల్లి, భక్తితో ఇలా ప్రశ్నించాడు.

మామూలుగా ప్రియమయిన సోదరుని కలుసుకునే విధంగాకాక, ఒక శిష్యుడు గురువుని సమీపించినట్లుగా వినయంగా సమీపించాడు. లక్ష్మణుని అంతరంగం వాసనాబలం నుంచి శుద్ధికాబడింది. అలా నిశ్చలం కాబడిన మనస్సే ధ్యానం ద్వారా తాత్విక రహస్యాలనూ ఆధ్యాత్మిక లక్షణాలను గ్రహించగల శక్తిని పొందుతుంది. గురువుని ఏకాంతంలో ప్రశ్నించడం కూడా ఉత్తమ శిష్యుని లక్షణం.

శ్లో॥ త్వం శుద్ధబోధో-సి హి సర్వదేహినాం
ఆత్మాస్యధిశో-సి నిరాకృతిః స్వయమ్ ।
ప్రతీయసే జ్ఞానదృశాం మహామతే
పాదాబ్జ భృంగాహిత సంగ సంగినామ్ ॥ 4

4. లక్ష్మణుడు రామునితో అంటున్నాడు 'నీ సహజ స్వరూపంలో శుద్ధమైన ఆత్మ చైతన్యంగా నీవు నిరాకారుడవు, నీకు రూపమే లేదు. అయినప్పటికీ నిరంతరమూ నిన్నుభక్తితో సేవించే వారి మనస్సు శుద్ధమవుతుంది, కాబట్టి నీ స్వస్వరూపమయిన ఆత్మ తత్త్వాన్ని అట్టివారు గ్రహించగలుగుతారు. జ్ఞాన స్వరూపాన్ని గుర్తించ గలుగుతారు.

శ్రీరామునిలోని పరమాత్మ స్వరూపాన్ని లక్ష్మణుని భక్తిభరిత హృదయం గుర్తించ గలిగింది. అలా గుర్తించటమేగాక, నీ వలననే అన్ని రకముల జ్ఞానమూ సంభవమవు తోంది అని స్వయంగా అంటున్నాడు.

శ్లో॥ అహం ప్రపన్నోస్మి పదాంబుజం ప్రభో
భవాపవర్గం తవ యోగిభావితమ్ ।
యధాంజసాజ్ఞాన మపారవారిధిం
సుఖం తరిష్యామి తధానుశాధి మామ్ ॥ 5

5. కిందటి శ్లోకంలో శిష్యుడు తన గురువును కేవలం వ్యక్తికంటే ఉన్నతమైన తత్త్వంగా ఒప్పకున్నాడు. అతడు తన గురువులో అనంతమైన ఆత్మచైతన్యాన్ని గుర్తించగలిగేడు. ఈ విధంగా గురువును మహోన్నతంగా భావించే మనఃస్థితి సాధకునకెంతగానో ఉప యోగపడుతుంది.

శిష్యుడయిన లక్ష్మణుడు ఈ విధంగా గురువయిన రాముని శరణొందిన తరు వాత సహాయాన్నీ, జ్ఞానాన్నీ అర్థించాడు. అజ్ఞాన సాగరాన్ని సులభంగా, వేగంగా దాటగల ఉపాయాన్ని, మార్గాన్ని చూపించమని లక్ష్మణుడు ప్రత్యేకంగా అడుగుతున్నాడు.

మనకి మన సత్యస్వరూపం తెలియకపోవటం వల్ల, మనం పరిమిత బాధా మయ నీరసజీవులమనే వ్యక్తిత్వ భావన జనిస్తోంది. ఈ విధంగా సత్యాన్ని తెలియని అగ్రహణమూ, ఫలితమయిన అన్యధా గ్రహణమూ కలిసి, వేదాంత పరిభాషలో అజ్ఞానం అనబడుతోంది

శ్లో॥ శృత్వాథ సౌమిత్రివచోఖిలం తదా
ప్రాహ ప్రపన్నార్తిహరః ప్రసన్నధీః ।
విజ్ఞాన మజ్ఞాన తమః ప్రశాన్తయే
శృతి ప్రపన్నం క్షితిపాలభూషణః ॥ 6

6. ఒక విద్యార్థిలోని ఉత్సాహాన్నీ, శ్రద్ధనూ, అర్హతనూ గుర్తించిన ఏ గురువుకైనా సరే, అతనికి బోధించటం ఎంతో సంతోషాన్ని కలిగిస్తుంది. రామునిలోని గురువు, లక్ష్మణునిలోని ఉత్తమ శిష్యత్వాన్ని గుర్తించి, అజ్ఞానాంధకార నిర్మూలనకు సూటి అయిన రాజబాట ఉత్తమమైన జ్ఞాన సంపాదనే అని చెపుతున్నాడు.

రాముడు బోధించిన ఈ జ్ఞానం ఉపనిషత్సారం. ఇట్టి ఉపనిషత్ సారాన్ని గ్రహించగలిగిన జ్ఞానం మనలను ఉన్నత చైతన్య భూమిక అయిన విజ్ఞానానికి చేర్చగలుగుతుంది. మర్త్యత్వం అమృతత్వంలో లీనం కావడమే ఈ జ్ఞానదర్శనం. సత్య సాక్షాత్కారం.

శ్లో॥ ఆదౌ స్వవర్ణాశ్రమ వర్ణితాః క్రియాః
కృత్వాసమాసాదిత శుద్ధమానసః ।
సమాప్య తత్ పూర్వముపాత్త సాధనః
సమాశ్రయేత్సద్ గురుమాత్మ లబ్ధయే ॥ 7

7. శ్రీరామచంద్రుడు ఇలా చెప్తున్నాడు - మనకు విధించిన వర్ణాశ్రమ ధర్మాలని ఆచరించి, శుద్ధమైన అంతరంగాన్ని సాధించి, అంతకుముందున్న కర్మలని వదలాలి. ఈ విధంగా అవసరమయిన అర్హతలను పొంది, శరణాగత భావంతో సద్గురుని ఆత్మజ్ఞానం పొందటానికి ఆశ్రయించాలి.

నిస్వార్థంతో కర్మలు ఆచరించటం వలన, మనలోని వాసనలు క్షయమయే అవకాశం ఉంది. దీని వలన మనస్సు పరిశుద్ధి నొంది, ఏకాగ్రంగా తయారవుతుంది. అప్పడే గురుసాంగత్యంలో వేదాంత విద్యని పరిపూర్ణంగా పొందగలము.

శ్లో॥ క్రియాశరీరోద్ భవహేతురాదృతా
ప్రియాప్రియా తౌ భవతః సురాగిణః ।
ధర్మేతరౌ తత్ర పునః శరీరకం
పునః క్రియా చక్రవదీర్యతే భవః ॥ 8

8.ఇందులో గురువుగా రాముడు కర్మల యొక్క స్వభావాన్ని నిశితంగా విమర్శిస్తున్నాడు. భౌతికంగా వ్యక్తమయ్యే ఈ శరీరానికి కర్మలే కారణంగా భావింపబడుతున్నాయి. కర్మల వలన అంతరంగ శాంతి ఎప్పటికీ పొందలేం. కర్మల వలన కర్మఫలాల ననుభవించే క్షేత్ర మనదగిన శరీరాన్నీ, మరొక జన్మనీ పొందడం మాత్రమే సాధ్యపడుతుంది.

ధర్మకర్మలూ, అధర్మకర్మలూ మనలో మంచి చెడు వాసనలని కలిగిస్తాయి. ఈ వాసనలను అనుభవించటానికి తిరిగి జన్మని పొందక తప్పదు. ఈ విధంగా కర్మల వలన మనం కర్మలను చేస్తూ, ఫలితాలననుభవిస్తూ, చక్రభ్రమణం వలె అనంతంగా జన్మపరంపరను కొనసాగించవలసి వస్తుంది తప్ప మోక్షాన్ని ప్రసాదించవు.

శ్లో॥ అజ్ఞానమేవాస్య హి మూలకారణం
తద్ధానమేవాత్ర విధౌ విధీయతే ।
విద్యైవ తన్నాశవిధౌ పటీయసీ
న కర్మ తజ్జం సవిరోధమీరితమ్ ॥ 9

9. ఈ సంసారానికి మూల కారణం అజ్ఞానము. అజ్ఞానాన్ని నిర్మూలించగలిగేది జ్ఞానం మాత్రమే. కర్మ ఎన్నటికీ కాదు. కర్మలన్నీ అజ్ఞాన జనితాలని చెప్పబడుతున్నాయి. కాబట్టి కర్మకూ అజ్ఞానానికీ బేధం లేదు.

అజ్ఞానం వలననే మనం పరిమితమైన జీవులమని బాధపడుతూ ద్వంద్వమయ జగత్తు యొక్క బంధం నుండి విడివడి అంతులేని ఆనందాన్ని పొందాలనే కోరికతో నిత్యమూ శ్రమిస్తున్నాము. కాని అజ్ఞాన జనితాలే కర్మలు కాబట్టి తన మూలకారణాన్ని తానే నిర్మూలింపజాలదు. రోగి లక్షణాలెన్నటికీ రోగాన్ని నిర్మూలించలేవు.

శ్లో॥ నాజ్ఞానహానిర్ న చ రాగసంక్షయో
భవేత్తతః కర్మ సదోషముద్ భవేత్ ।

తతః పునః సంసృతిరప్య వారితా

తస్మాద్ బుధో జ్ఞాన విచారవాన్ భవేత్ ॥     10

10. కర్మలెన్నటికీ అజ్ఞానాన్ని అంతమొందించలేవు. కర్మఫలాల పట్ల మమకారాలను కూడా తగ్గింపజాలవు. పైగా కర్మల నుండి బంధించే కొత్త కర్మలు పుట్టుకొస్తుంటాయి. వాటి ఫలితంగా సంసారంలో చిక్కుకుపోవటం తప్పనిసరి అవుతుంది. కాబట్టి తెలివయిన సాధకులు జ్ఞాన స్వభావం గురించి విచారించాలి.

ఇక్కడ అజ్ఞానం అంటే అజ్ఞాన జనితమయిన అహంకారం. నేను చేస్తున్నాననే కర్తృత్వ భావనను కర్మల నుండి తొలగించటం సాధ్యంకాదు. కర్తృత్వ భావనా, భోక్తృత్వ భావనా కలిసి అహంకారం అనబడతాయి. అదే జీవభావం, వ్యక్తిత్వ భావన. ఈ శ్లోకం ఈ శ్రీరామ గీతకి ఉపోద్ఘాతం లాంటిది.

శ్లో॥   నను క్రియా వేదముఖేన చోదితా

తథైవ విద్యా పురుషార్థ సాధనమ్ ।

కర్తవ్యతా ప్రాణభృతః ప్రచోదితా

విద్యాసహాయత్వముపైతి సా పునః ॥     11

11. పరమ పురుషార్థాన్ని సాధించటానికి జ్ఞానం మార్గమనీ, బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మాన్ని చేరుకుంటాడని వేదాలు స్పష్టంగా చెప్తున్నాయి.

తాను చెప్పినదానిని ఇంకా బాగా బోధించటానికి శ్రీరాముడు ఇతరుల వాదాలని కూడా చెప్తున్నాడు. కర్మకాండననుసరించేవారు వేదాలు జ్ఞానంతోబాటు కర్మమార్గం కూడా బోధించాయని అంటున్నారు.

శ్లో॥   కర్మాకృతౌ దోషమపి శ్రుతిర్ జగౌ

తస్మాత్ సదా కార్యమిదం ముముక్షుణా ।

నను స్వతంత్రా ధృవకార్య కారిణి

విద్యా న కించిన్మ నసాప్య పేక్షతే ॥ 12

12. ప్రతివాదుల వాదం కొనసాగుతోంది. కర్మలు ఆచరించకపోవడం పాపమని కూడా వేదాలు చెప్తున్నాయి. మోక్షాన్ని కోరేవారు ధ్యానాన్ని అభ్యసిస్తూనే వేదవిహిత కర్మ లను కూడా విధిగా ఆచరించాలని అంటున్నారు. కర్మ అవసరం లేదని నీవనేటట్లయితే, స్వప్నంలో కూడా ఇది సంభవం కాదు అంటున్నారు.

ఈ మాటలన్నీ సముచ్ఛయ వాదులవి. కర్మలను విధించినట్లుగా ఆచరించక పోయినా, కర్మలు చేయకపోయినా కూడా పాపం వస్తుందని అంటున్నారు. జ్ఞాన మార్గ మొక్కటే చాలుననీ, కర్మ అక్కర లేదనీ అనడం చాలా ప్రమాదకరం అంటున్నారు.

శ్లో॥ న సత్యకార్యోపి హి యద్వదధ్వరః

ప్రకాంక్షతేన్యానపి కార కాదికాన్ ।

తథైవ విద్యా విధితః ప్రకాశితైః

విశిష్యతే కర్మభిరేవ ముక్తయే ॥ 13

13. వేదాలలో కర్మకాండ విభాగంలో ఎన్నో యాగాలు, జపతప పూజాది క్రతుకర్మలూ వివరంగా ఇవ్వబడ్డాయి. వాటి ఫలితాలు కూడా గొప్పగా వర్ణింపబడ్డాయి. అదే విధంగా జ్ఞాన మార్గం కూడా వేదాలలో నిర్దేశింపబడిన కర్మల సహాయం వలన మాత్రమే ముక్తి నివ్వగలదు అంటున్నారీ సముచ్ఛయవాదులు.

ఈ మూడు శ్లోకాలలోనూ, సముచ్ఛయవాదులు జ్ఞాన, కర్మలు ఒకదానికొకటి సహాయకారులుగా బలానిచ్చినప్పడే ముక్తి సాధ్యమవుతుంది అంటున్నారు. జ్ఞాన మార్గం వీరి దృష్టిలో స్వతంత్రం కాదు. శ్రీరామచంద్రుడు గురువుగా తను బోధించేది మాత్రమే బోధించక ఇటువంటి వాదం కూడా ఉందని తెలియపరుస్తున్నారు.

శ్లో॥ కేచిద్వదన్తీతి వితర్కవాదిన్

తదప్య సద్దృష్ట విరోధ కారణాత్ ।

దేహాభిమానాదభి వర్తతే క్రియ

విద్యా గతాహంకృతితః ప్రసిద్ధ్యతి ॥ 14

14. ఇక్కడి నుంచి శ్రీరామచంద్రుడు సముచ్ఛయవాదుల వాదానికి జవాబుని ఇస్తున్నాడు. ఇది కుతర్కమే గాని సరియైన వాదం కాదు. ఎందుకంటే వాటిలో స్పష్టంగా వైరుధ్యం కనబడుతుంది. కర్మ చేయటానికి నేను అనే అహంకారం లేదా కర్తృత్వ భావన ఉండాలి. జ్ఞాన దర్శనానికి అహంకారం, దేహ తాదాత్మ్యం నశించాలి.

కాబట్టి కర్మ, జ్ఞాన మార్గాలు రెండింటినీ ఒకదానికొకటి సహాయకారులు అనుకోవడం పొరపాటు వాదనే. స్వప్న జగత్తులోని అహంకారం ఎన్నటికీ జాగ్రదావస్థను చేరుకోలేదు. జాగ్రదావస్థలోని అహంకారం సుషుప్తి అవస్థలో అంతమయిపోతుంది.స్వప్న జాగ్రత్ - సుషుప్తి అహంకారం పూర్తిగా అదృశ్యమయితేనే ఆత్మ సాక్షాత్కారమౌతుంది. అదే స్వరూప స్థితి.

శ్లో॥ విశుద్ధ విజ్ఞాన విరోచనాం చితా

విద్యాత్మవృత్తిశ్చరమేతి భణ్యతే ।

ఉదేతి కర్మాఖిల కారకాదిభిర్

నిహంతి విద్యాఖిల కారకాదికమ్ ॥ 15

15. విద్య అనే పదం యొక్క అర్థాన్ని శ్రీరామచంద్రులు ఇక్కడ స్పష్టంగా నిర్వచిస్తున్నారు. శుద్ధమయిన అంతరంగంలో ధ్యానం ద్వారా ఏర్పడిన ఆత్మను గురించిన ఆలోచనే విద్య అనబడుతుంది. కర్మ కారణాలవల్ల (ఇంద్రియాల వల్ల) ఉదయిస్తుంది. విద్య ఆ కారణాలను ఇంద్రియాలను నశింపజేస్తుంది.

కర్మ, జ్ఞాన మార్గాలకు అవినాభావ సంబంధం ఉందన్న వాదనని శ్రీరామచంద్రు డిక్కడ ఒక్క వేటుతో సమూలంగా ఖండించారు. కర్మలో మనస్సు బాగా పనిచేస్తూ, పని చేసే క్షేత్రంలోనికి బాహ్యాభిముఖంగా ప్రసరించాలి. ఇదే ధ్యానంలో అయితే, బాహ్యప్ర పంచం నుంచి మనస్సుని అంతర్ముఖం చేసి, జీవాత్మ పరమాత్మల అభేదత్వ విచారణతో ఏకాగ్రంగా నిలపాలి. ఆత్మాకార వృత్తిలో మనస్సుని లగ్నం చేయాలి.

శ్లో॥ తస్మాత్త్య జేత్కార్యమశేషతః సుధీర్
విద్యావిరోధాన్న సముచ్చయో భవేత్ ।
ఆత్మానుసన్ధానపరాయణః సదా
నివృత్త సర్వేంద్రియవృత్తి గోచరః ॥ 16

16. కాబట్టి అంతరంగం శుద్ధి అయినవారు అన్ని కర్మలను త్యజించాలి. కర్మలు జ్ఞానా నికి విరుద్ధమైనవి కాబట్టి ఒక్కసారి వీటిని ఆచరించటానికి వీలుకాదు. ఇంద్రియాలను కార్యకలాపాలనుంచి మరలించి, మనస్సుని శాంతింపజేసి, సాధకుడు ఎల్లవేళలా ఆత్మ మీదనే దృష్టి నిలిపి ధ్యానించాలి.

అన్ని పనులను విడిచి పెట్టి సోమరిలా కూర్చోమని దీని భావం కాదు. ఎవరూ కూడా కర్మలను పూర్తిగా విడిచి పెట్టలేరు. వ్యక్తి జీవించి ఉండటమే కర్మలను చేయటం. కర్తృత్వ, భోకృత్వ భావాలను వదిలి చేస్తే అవి అకర్మలవుతాయి.

శ్లో॥ యావచ్ఛరీరాదిషు మాయయాత్మధీః
తావద్విధేయో విధివాదకర్మణామ్ ।
నేతీతి వాక్యై రఖిలం నిషిధ్య తత్
జ్ఞాత్వా పరాత్మనమథ త్యజేత్క్రియాః ॥ 17

17. కర్మలను త్యజించమనే మాట సాధకునికి దిగ్భ్రాంతి కలిగించవచ్చు. అందుకే దాని భావాన్ని ఈ శ్లోకంలో వివరిస్తున్నాడు, శ్రీరామ చంద్రుడు. ఎంత కాలం ఈ శరీరమే నేననే భావనతో నమ్మకం కలిగి ఉంటావో, ఎంత కాలం మాయకు లోబడి దేహాత్మ భావాన్ని కలిగి ఉంటావో, అంతకాలమూ వేదవిహితమైన పవిత్ర నిస్వార్థ కర్మల నాచరి స్తూనే ఉండు. ఆ తర్వాత నేతి నేతి ఇది కాదు, ఇది కాదు అనే శృతి వాక్యాల సహా యంతో శరీర తాదాత్మ్య భావం నుండి బయట పడాలి. ఆత్మను దర్శించాలి. అప్పుడు అన్ని కర్మలనూ విడిచిపెట్టాలి.

సత్యం తెలియక పోవటమనే ఆవరణ (అగ్రహణం) దాని ఫలితమైన విక్షేపము (అన్యధాగ్రహణం) ఈ రెండూ కలసి మాయ అనబడతాయి. శుద్ధ బోధ రూపమయిన ఆత్మని గుర్తించగానే విశ్లేష రూపమయిన నీ అజ్ఞానం అంతరిస్తుంది. ఆ స్థితిలో నీవు కర్మలను త్యజించటం అనే ప్రశ్నే ఉదయించదు. అన్ని కర్మలూ వాటంతట అవే నీ నుంచి తొలగిపోతాయి. (నీ వేమీ చెయ్యక పోవటాన్ని స్పష్టంగా గుర్తించగలుగుతావు)

శ్లో॥ యదా పరాత్మాత్మ విభేద భేదకం
విజ్ఞాన మాత్మన్యవభాతి భాస్వరమ్ ।
తదైవ మాయా ప్రవిలీయతేంజసా
సకారకా కారణమాత్మ సంస్కృతేః ॥ 18

18. 5వ శ్లోకంలోని లక్ష్మణుని ప్రశ్న ఏ విధంగా వెంటనే భవసాగరం నుండి తరించగ లము కి జవాబు ఇక్కడ దొరుకుతుంది.

(1) పరమాత్మ (2) నేను, వేరనుకునే అహంకారము ((3) జీవభావం) భగవం తునిచే సృష్టించబడిన నానాత్వమయిన ప్రపంచం ఈ మూడూ కూడా ప్రత్యక్షంగా విజ్ఞానాన్ని దర్శించటం వలన అంతరించి పోతాయి. అప్పుడు అంతరంగంలో జ్యోతి స్వరూపమైన (భాస్వరమ్) ఆత్మ ఉదయిస్తుంది. (అవభాతి) స్వయంగా స్ఫురిస్తుంది.

కల నుండి మేలుకోగానే స్వప్న ప్రపంచం ఏ విధంగా హఠాత్తుగా అదృశ్యమయి పోతుందో, ఆ విధంగా భ్రమలతో కూడిన ద్వంద్వమయ ప్రపంచం ప్రత్యక్షమయిన ఆత్మా నుభూతితో అదృశ్యమయిపోతుంది. ఆవరణ విశేషాలతో కూడిన మాయ అంతర్ధాన మయి పోతుంది.

శ్లో॥ శ్రుతి ప్రమాణాభివినాశితా చ సా
కథం భవిష్యత్యపి కార్యకారిణీ ।
విజ్ఞాన మాత్రాదమలాద్వితీయతః
తస్మాదవిద్యా న పునర్భవిష్యతి ॥ 19

19. ఒకసారి నశింప చేయబడినా మాయ మరల తన ప్రభావాన్ని చూపిస్తుందేమోననే శంక శిష్యునిలో కలగవచ్చు. అది ముందే ఊహించి గురువు ఈ విధంగా అంటున్నారు. ఆవరణ ఉండటం వలననే విక్షేపం సంభవమవుతుంది. ఆవరణే తొలగిపోయిన తరు వాత విక్షేపాలకు అవకాశం ఉండదు. ప్రత్యక్షంగా సత్యాన్ని దర్శించటం వల్ల ఆవరణ నశించి, విక్షేపం తన మాయాజాలాన్ని ఉపసంహరించుకుని పూర్తిగా అదృశ్యమయి పోతుంది.

ప్రత్యక్ష దర్శనంలో ఊహాకల్పనలన్నీ నశిస్తాయి. తరువాత ఎప్పుడూ సత్యాన్నే చూస్తుండటం వలన ఊహాకల్పనలు తలెత్తే అవకాశమే ఉండదు. కాబట్టి వ్యక్తి ఎప్పటికీ మళ్ళీ మోహపాశబద్ధుడు కాలేడు. అటువంటి వాని మీద మాయ తన ప్రభావాన్ని చూప లేదు.

శ్లో॥ యది స్మ నష్టాన పునః ప్రసూయతే
కర్తాహమస్మేతి మతిః కథం భవేత్ ।
తస్మాత్ స్వతంత్రా న కిమస్యపేక్షతే
విద్యా విమోక్షాయ విభాతి కేవ ॥ 20

20. సముచ్ఛయ వాదుల వాదంలోని లోపాన్ని ఎత్తి చూపుతూ వారి వాదం ఎంత అసమంజసమయినదో శ్రీరామచంద్రుడు వివరిస్తున్నాడు.

మాయను ఒకసారి నశింపజేస్తే దాని ఫలితాలయిన విక్షేపాలన్నీ కూడా పూర్తిగా నశిస్తాయి. అటువంటప్పుడు భ్రమను కలగజేసే అహంకారం ఏ విధంగా నేను కర్తను అనే భావాన్ని కలగజేయగలదు ? అందువల్ల కర్మ జ్ఞానము రెండూ ఒకే సాధకుని చేత ఒకే సమయంలో అనుసరింపబడజాలవు.

అజ్ఞానాన్ని నిర్మూలించ గలిగేది జ్ఞానం మాత్రమే ప్రత్యక్షంగా చూడటం ఒక్కటే చూడకపోవటాన్ని అంతం చేయగలదు. ఈ విధంగా జ్ఞాన మార్గం సర్వ స్వతంత్రమయినది. దీనికి వేరే ఏ సహాయమూ అవసరం లేదు. ఇది స్వయంగా సర్వ సమృద్ధమయినది.

శ్లో॥ సా తైత్తిరీయ శ్రుతిరాహ సాదరం
న్యాసం ప్రశస్తాఖిల కర్మణా స్ఫుటమ్ ।
ఏతావదిత్యాహ చ వాజినాం శ్రుతిర్
జ్ఞానం విమోక్షాయ న కర్మ సాధనమ్ ॥ 21

21. ఇంతవరకూ తర్కం ద్వారా నిర్దుష్టంగా చెప్పిన దానినే ఇప్పుడు సుప్రసిద్ధమయిన శృతి వాక్యాలని ఆధారంగా తీసుకుని చెప్తున్నాడు, శ్రీరామచంద్రుడు. ప్రత్యక్ష, అనుమాన ప్రమాణాలనే కాక, శృతి వాక్యాలను కూడా వేదాంతం మూడవ ప్రమాణంగా ఒప్పకుంటుంది.

ప్రశస్త మయిన తైత్తిరీయ ఉపనిషత్తులో శాస్త్ర విహిత కర్మల నన్నిటిని తప్పకుండా త్యజించాలని దృఢంగా చెప్పబడింది. బృహదారణ్య కోపనిషత్తులో కూడా 'ఇది మాత్రమే అమృతత్వం' లాంటి వాక్యాల వలన మోక్షం పొందటానికి జ్ఞానమే ప్రధానమని, కర్మలు కాదని చెప్పబడింది.

బృహదారణ్యకోపనిషత్తులో నేతి-నేతి విధానంలోనే ముక్తిని సాధించగలవు. నీవు కాని వాటినన్నిటినీ నిరసిస్తూ  పోతే నీ స్వప్న రూపమయిన ఆత్మ తత్వాన్ని చేరుకోగలవు. ఈ ధ్యానమార్గానికి బాహ్యమయిన కర్మలు అవసరం లేదు అని యాజ్ఞవల్క్య మహర్షి మైత్రేయికి బోధించిన బోధలలో ఉంది.

శ్లో॥ విద్యాసమత్వేన తు దర్శితస్త్వయా

క్రతుర్ న దృష్టాంత ఉదాహృతః సమః ।

ఫలైః పృథక్త్వాద్ బహుకారకైః క్రతుః

సంసాధ్యతే జ్ఞానమతో విపర్యయమ్ ॥ 22

22. 13 వ శ్లోకంలో సముచ్చయ వాదులు యజ్ఞాన్ని చేయటానికి అనేక విధముల సహాయం ఎలా అవసరమో జ్ఞాన గమ్యాన్ని చేరటానికి కర్మల సహాయం అలా కావాలని ప్రతిపాదించారు. వీరి వాదానికి ఆధారమే లేదు. వారు దాన్ని ఋజువు చేయలేరని చూపిస్తున్నాడు శ్రీరామచంద్రుడు. ఎందువల్లనంటే ఈ రెండూ, రెండు విభిన్న రకాల ఫలితాల నిస్తాయి. కర్మవలన ఇంకా ఇంకా కొత్త కర్మలు పుడుతూ ఉంటాయి.  వాటిని చెయ్యటానికి మళ్ళీ మళ్ళీ పుడుతూ ఉండాలి. జ్ఞానం దానికి పూర్తిగా వ్యతిరేకమయినది.

ఒక కర్మను చేయాలంటే ఎన్నో ఇతరమయిన అంశాలు తోడ్పడాలి. కాని జ్ఞానం సర్వస్వతంత్రమయినది. దానికి దేని సహాయమూ అవసరం లేదు. శరీర స్పృహ నుంచి కర్మలు జనిస్తాయి. శరీర స్పృహ నశించినప్పడే జ్ఞానం సిద్ధిస్తుంది. కాబట్టి కర్మా, జ్ఞానమూ పరస్పర విరుద్ధమయినవి.

శ్లో॥ స ప్రత్యవాయో హ్యహమిత్యనాత్మధీః

అజ్ఞప్రసిద్ధా న తు తత్త్వదర్శినః ।

తస్మాత్ బుధైస్త్యాజ్యమవిక్రియాత్మభిర్

విధానతః కర్మ విధిప్రకాశితమ్ ॥ 23

23.12వ శ్లోకంలో కర్మల నాచరించక పోతే పాపమని సముచ్ఛయ వాదులు వాదిం చారు. దానికి సరియైన అర్ధం ఇక్కడ శ్రీరామ చంద్రుడు వివరిస్తున్నాడు. విక్షేపశక్తి ప్రభావానికి లోనయి తనను తాను మనశ్శరీరాలుగా పొరపడుతున్న వారికి మాత్రమే కర్మల నాచరించకపోతే పాపం వస్తుంది అన్నభావం వర్తిస్తుంది. సత్యాన్ని గ్రహించి మనశ్శరీరాలు తాను కాననే ధృఢ జ్ఞానం ఎప్పడైతే కలుగుతుందో అప్పడు ఇది ఎంత మాత్రం వర్తించదు. కాబట్టి నిత్యత్వాన్ని గుర్తించిన జ్ఞానులు వేద విహితమైన కర్మలని త్యజించాలి.

శరీరంలో తాదాత్మ్యం చెందిన వారు మాత్రమే సుఖ దుఃఖాలను తనవిగా అను భవిస్తూ శుభాలను అశుభాలను,పుణ్యములనూ పాపములను వేరు చేసి చూస్తుంటారు. శరీర స్పృహ నశించిన స్థిత ప్రజ్ఞులయిన జ్ఞానులు, అహంకారానికి చెందిన యీ అను భవాలని ఏ విధంగా గుర్తించగలుగుతారు?

శ్లో॥ శ్రద్ధాన్వితస్తత్త్వమసీతి వాక్య
గురోః ప్రసాదాదపి శుద్ధ మానసః ।
విజ్ఞాయ చైకాత్మ్యమధాత్మ జీవయోః
సుఖీ భవేన్మేరు రివాప్రకమ్పనః॥ 24

24. దశలవారీగా వేదాంతం బోధిస్తున్నాడు, శ్రీరామచంద్రుడు. నిష్కామ కర్మలు చేయ టం వల్ల అంతరంగం శుద్ధి చెందుతుంది. అట్టి శుద్ధ మయిన అంతరంగాన్ని సాధించిన సాధకుడు తాత్త్విక రహస్యాలని అర్ధం చేసుకోగల సునిశిత మేధను పొందుతాడు. నిశ్చల మనసుతో పరమ సత్యాన్ని అర్థం చేసుకోగలుగుతాడు. ఆ తర్వాత తత్త్వమసి వంటి మహావాక్యాలు సూచించే బాటలో, అచంచల ధ్యానంలో లక్ష్యాన్ని చేరుకుని పరమానందంలో పరిస్థితులకి చలించకుండా మేరు నగధీరుడై ఉంటాడు.

వ్యక్తిలోని అహంకారంగా జీవభావంతో గుర్తింపబడే తత్త్వము, బాహ్య ప్రపంచంగా అనేక రూపాలుగా కనిపించే తత్త్వమూ, ఈ సర్వానికీ సృష్టికర్త అయిన ఈశ్వర తత్త్వమూ కూడా ఒకటే. అవి సత్ చిత్ ఆనంద రూపమయిన ఆత్మ తత్త్వానికి విభిన్న వ్యక్తరూపాలు మాత్రమే అని గ్రహించటమే ఆధ్యాత్మసాధన యొక్క పరమార్థము. అది పరిశుద్ధ మయిన అంతరంగానికే సాధ్యమవుతుంది.

శ్లో॥ ఆదౌ పదార్థావగతిర్ హి కారణం
వాక్యార్థ విజ్ఞాన విధౌ విధానతః
తత్త్వం పదార్థౌ పరమాత్మ జీవకా
వసీతి చైకాత్మ్యమథానయోర్ భవేత్ ॥ 25

25. క్రిందటి శ్లోకంలో తత్త్వమసి వాక్యాలని సునిశితంగా పరిశీలించి అర్థం చేసుకోవాలన్నాడు. ఈ శ్లోకంలో ఆ పరిశీలన ఎలా ఉండాలో చూపిస్తున్నారు శ్రీరామచంద్రులు. 'ఆదౌ' ముందుగా ఒక మహా వాక్యంలో నిగూఢంగా ఉన్న అర్థాన్ని గ్రహించటానికి, ఆ విడి పదాల అర్థాలని జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి.

తత్ అంటే సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన ఈశ్వరుడని అర్థం. త్వం అంటే బుద్ధి పరంగా, శక్తి పరంగా పరిమితమయిన జీవుడని అర్థం. ఈ జీవునకు అజ్ఞానమే ఉపాధిగా పరిమితిగా ఉంటుంది. శ్రుతుల భాషలో సత్యం తెలియని వ్యక్తిగత అజ్ఞానం అవిద్య అనబడుతుంది. అసి అనే పదం ఇవి రెండూ ఒకటే అనే అర్థం సూచిస్తుంది. ఈ విధంగా జీవుడు, ఈశ్వరుడు ఒకటే అనటం అసంబద్ధంగా కనిపిస్తుంది. అందుకే శ్రీరాముడు 'అథ' ఇప్పుడు అన్న శబ్దాన్ని వాడాడు.ఈ ఏకత్వం ఎలాగో ముందు చూస్తాం.

శ్లో॥ ప్రత్యక్ పరోక్షాది విరోధమాత్మనోర్
విహాయ సంగృహ్య తయోశ్చిదాత్మతామ్ ।
సంశోధితాం లక్షణయా చ లక్షితాం

జ్ఞాత్వాస్వమాత్మాన మథాద్వయో భవేత్ ॥ 26

26. తత్ త్వం పదముల వాక్యార్థములను స్వీకరించటం ద్వారా కలిగే సందేహాలను విసర్జించు. తత్ అంటే ప్రత్యక్ష అర్థం సర్వ సృష్టికర్త అయిన ఈశ్వరుడు, త్వం అంటే వ్యక్తి గతమైన జీవభావం. స్వభావాలలో వీటికి గల వైరుధ్యాన్ని పరిశీలిస్తుంటే వీటికి ఏక త్వాన్ని తార్కికంగా ఆమోదించలేము. ఈ రెండు పదములూ సూచించే లక్ష్యార్థంలో మాత్రమే వీటి ఏకత్వం కనిపిస్తుంది.

ఈ రెండింటికీ మధ్యనున్నట్లుగా కనిపించే విభేదమంతా బాహ్యంగా వాటిని ఆవరించి ఉన్న ఉపాధులకు చెందినది మాత్రమే (వ్యష్టి మనస్సు, సమిష్టి మనస్సు) ధ్యాన(జ్ఞాన) మార్గాన పయనించే సాధకుడు, ఏకాగ్రతతో తత్వమసి వాక్యాన్ని విచారిస్తూ ప్రగాఢ ధ్యానంలో ఉంటే, తనలో అంతర్గతంగా జీవునిగా ఉన్న తత్వానికి బాహ్యంగా జగత్తు అంతటికీ అధీశుడుగా ఉన్న ఈశ్వరుని తత్వానికీ భేదం లేకపోవటాన్ని అప్పడు చూడగలుగుతాడు. సాగర సంగమంలో నది తన నామాన్ని, రూపాన్నీ కోల్పోతుంది. అలాగే వ్యక్తిగతమైన అహంకారం ధ్యానంలో ఏకత్వానుభూతిలో లీనమయిపోతుంది.

శ్లో॥ ఏకాత్మకత్వాజ్జహతీ న సంభవేత్

తథాజహల్లక్షణతా విరోధతః ।

సో -యమ్ పాదర్థావివ భాగలక్షణా

యుజ్యేత తత్త్వంపద యోరదోషతః॥ 27

27. మహావాక్యం సూచించే లక్ష్యార్థాన్ని గ్రహించటానికి జహత లక్షణ విధానాన్ని గానీ, అజహతలక్షణ విధానాన్ని కాని ఉపయోగించకూడదని జహాదజహాల్ల క్షణాన్ని ఉపయో గించాలని శ్రీరామ చంద్రుడు చెప్తున్నాడు. దీనినే భాగత్యాగ లక్షణమని కూడా అంటారు.

జహత్ లక్షణమంటే మనం చెప్పినదానిలో అనవసరమయిన దానిని త్యజించి అవతలి వ్యక్తి తెలివిగా అర్థం చేసుకోవటం. మాయిల్లు సరిగ్గా ఆ నది మీదే ఉంది అంటే

ఇంటి కిందనున్న నదిని త్యజించి, నది ప్రక్కనే ఉన్న స్థలంలో యిల్లు ఉందని అర్థం చేసుకుంటాడు. ఇక్కడ జహత్ లక్షణాన్ని ఉపయోగించి బాహ్యంగా ఉండే ఉపాధులను తీసేస్తే అంతర్గతంగా ఉన్న అవిద్య - మాయ  అని అర్థం చేసుకోకూడదు.

అజహల్లక్షణ మంటే మనం చెప్పిన దానికి మరికొంత కలిపి అర్థం చేసుకోవాలి. అవతలి వ్యక్తి తుపాకులన్నీ నడిచి వెళ్లేయి అంటే తుపాకుల కింద సిపాయిలను కూడా కలుపుకుని వారటు వెళ్ళారని అర్థం చేసుకుంటాడు. అవిద్యో పాధిచే పరిమితుడయిన జీవుడూ, మాయోపాధిచే పరిచ్ఛిన్నుడయిన ఈశ్వరుడూ ఒక్కటే అనే అర్థానికి ఏమి కలిపినా అహం బ్రహ్మాస్మి అనే అర్థం ఏర్పడటం లేదు.

జహత్ అజహత్ లక్షణమంటే మనం చెప్పేదాంట్లో కొంత భాగాన్ని త్యజించి, మరి కొన్ని అంశాలని కలిపి,మన భావాన్ని అర్థం చేసుకోవాలి. 'ఆ దేవదత్తుడే (అప్పటి బాలుడే) ఈ యువకుడు. అంటే దేవదత్తుని పదంలో ఆనాటి ఆకారం గుణాల అమాయక బాలు న్ని త్యజించి ఈనాటి ఆకార, గుణాల యవ్వనాన్ని కలుపుకుని అర్థం చేసుకోవాలి. బాలు డులోనూ, యవ్వనుడులోనూ ఉన్న వ్యక్తి ఒక్కడే. అలాగే పరస్పర విరుద్ధమయిన అవిద్య ను మాయను త్యజించి, ఈ రెండింటి ద్వారా వ్యక్తమయే ఆత్మమాత్రం తత్త్వతః ఒక్కటే నని అర్థం చేసుకోవాలి.

శ్లో॥ రసాది పంచీకృత భూతసంభవం
భోగాలయం దుఃఖసుఖాది కర్మణామ్ ।
శరీరమాద్యన్త వదాది కర్మజం
మాయా మయం స్థూలముపాధిమాత్మనః ॥ 28

28. ఈశ్లోకంలోను రాబోయే రెండు శ్లోకాలలోనూ శ్రీరామ చంద్రుడు స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలను వర్ణిస్తూ నిర్వచిస్తున్నారు. ఆత్మ ఉపాధులచే ఆవరింపబడి వాటి ద్వారా వ్యక్తమౌతూ వాటికే పరిమితం కావటం చేత ప్రత్యక్షంగా మనకు కనబడటం లేదు.

స్థూలమయిన శరీరాలన్ని కూడా ఈ పంచభూతాల స్థూలాంశాల నుండే ఉద్భవిస్తాయి. పదార్థం ఒకటే అయినప్పటికీ, వ్యక్తి యొక్క ప్రారబ్ధ కర్మలననుసరించి, తయారయే శరీరం యొక్క ఆకృత పరిణామమూ విభిన్నంగా మారుతుంటుంది. మన వ్యక్తిత్వంలో నిక్షిప్తమయి ఉన్న గత కర్మలను వాసనలని అంటారు. ఈ వాసనలే స్థూల శరీరాకృతిని నిర్ణయిస్తాయి (ఇది వృక్ష, జంతు, మానవ జాతులలో ఏదయినా కావచ్చు. ప్రారబ్ధం అని పిలవబడే గత వాసనలన్నిటినీ క్షయం చేసుకోటానికి మనకి ప్రస్తుతం ఈ శరీరం ఏర్పడింది.)

ఆత్మ కేవలం సాక్షి మాత్రమే. ఇది ఉపాధులచే కలుషితం కాదు, మార్పు చెందదు. కానీ మనం ఉపాధులతో తాదాత్మ్యం చెంది పరిమితమైనట్లుగా అనుకుంటున్నాము ఈ శరీరము, ఆత్మ యొక్క స్థూల ఉపాధి అత్యంత బాహ్యరూపం మాత్రమే.

శ్లో॥ సూక్ష్మం మనోబుద్ధి దశేంద్రియైర్యుతం
ప్రాణైరపంచీకృత భూతసంభవమ్ ।
భోక్తుః సుఖాదే రనుసాధనం భవేత్
శరీర మన్య ద్విదురాత్మనో బుధాః ॥ 29

29. ఇందులో సూక్ష్మశరీరాన్ని వివరిస్తున్నాడు. మనస్సు, బుద్ధి, దశేంద్రియాలు, పంచ ప్రాణాలతో కూడి, పంచ సూక్ష్మభూతాలతో నిర్మింపబడి, జీవునిచే సుఖదుఃఖాలనే అనుభవాలు పొందటానికి ఉపయోగపడే ఆత్మయొక్క ఈ ఉపాధిని సూక్ష్మశరీరమని బుధులు, అంటే జ్ఞానులంటారు.

స్థూల శరీరానికి ఆధారంగా సూక్ష్మశరీరం ఉంటుంది. పైన చెప్పిన తత్వాలు కలిస్తే సూక్ష్మశరీరమనబడుతుంది. ఇవి పంచభూతాల సూక్ష్మాంశాలయిన తన్మాత్రలచే నిర్మింబడతాయి. ఈ సూక్ష్మశరీరం ద్వారానే జీవుడు బాహ్య ప్రపంచంలో సంబంధమేర్పరచుకుని సుఖదుఃఖానుభవాలని పొందుతాడు.

శ్లో॥ అనాద్యనిర్వాచ్య మపీ హ కారణం
మాయా ప్రధానం తు పరం శరీరకమ్ ।
ఉపాధిభేదాత్తు యతః పృథక్ స్థి తం
స్వాత్మానమాత్మన్యవధారయేత్ క్రమాత్ ॥ 30

30. మూడవదీ చివరిదీ అయిన ఉపాధిని కారణ శరీరాన్ని ఇక్కడ శ్రీరామ చంద్రులు వర్ణి స్తున్నారు. అనాది, అనిర్వచనీయము అయిన మాయచే నిర్మింపబడిన మూడవ ఉపాధిని కారణ శరీరమని అంటారు. ఆత్మ ఈ ఉపాధులన్నిటికంటే వేరుగా విలక్ష ణమ యినది కాబట్టి సాధకుడు క్రమంగా ఈ ఉపాధులను నిరసిస్తూ వాటికి భిన్నంగా తనలో ఉన్న ఆత్మని గుర్తించగలగాలి.

కారణ శరీరంలోనే వాసనలన్నీ ఇమిడి ఉంటాయి. వీటి వల్లనే స్థూ ల, సూక్ష్మ శరీ రాలు ఏర్పడతాయి. కాబట్టి కారణశరీరం అంటారు. అత్యంత సూక్ష్మమైన కారణ శరీరం సుషుప్తి అవస్థ లో పనిచేస్తుంది. ఇది పూర్తి అజ్ఞాన స్థి తి. దీని వలననే విక్షే పాలకు అవ కాశం ఏర్పడుతోంది. విక్షే పరూప మయిన సంసారానికి మూల కారణం కాబట్టి దీనిని కారణ శరీరం అంటారు.

ఆవరణ విక్షే పాలు రెండూ కలసి అజ్ఞానమనబడుతుంది. (అవిద్య, మాయ) మూడు శరీరాలు కూడా అవిద్య యొక్క వ్యక్తరూపాలే. పృథక్ స్థి త ఈ మూడు శరీరాల కంటే విలక్ష ణంగా చైతన్యం ఉంటూ సన్నిధిమాత్రేణ సన్నిధి చేతనే వీటికి జీవాన్ని (చైత న్యాన్ని) ప్రసాదిస్తోంది.

శ్లో॥ కోశేష్వయం తేషు తు తత్తదాకృతిర్
విభాతి సంగాత్ స్ఫటికోపలో యథా ।
అసంగరూపో -యమజో యతోద్వయో
విజ్ఞాయతే -స్మిన్ పరితో విచారితే ॥ 31

31. ఆత్మ అజమూ, అసంగమూ అయితే స్థూల సూక్ష్మ కారణ శరీరాలు లేకుండా దీనికి ఉనికి లేనట్లుగా ఎందుకు అనిపిస్తోంది ? ఈ మూడు శరీరాలకూ చెందకుండా విడిగా ఆత్మకు ఉనికి ఉన్నట్లుగా ఎందుకు తెలియబడటం లేదు అనే ప్రశ్న ఉదయించవచ్చు. అది ఊహించే శ్రీరామచంద్రుడు దీనిని వివరిస్తున్నాడు.

ఒక గాజు పలకకు ఎటువంటి రంగు ఉండదు. కానీ దాని దగ్గర ఎర్రని పుష్పాన్ని ఉంచితే ఆ స్ఫటికానికి ఎర్రని రంగు ఉన్నట్లుగా కనిపిస్తుంది. అంటే ఈ రంగు స్ఫటికానికి కాదు, పక్కనున్న వస్తువుది. అలాగే ఇలాటి భ్రాంతి తోచటం అధ్యాస అనబడుతుంది. ఆత్మ అసంగము సంగము లేనిది. కేవలం సాక్షి మాత్రమే, కాని పంచకోశాల ద్వారా ప్రసరించినప్పడు వాటి లక్షణాలను పొందినట్లుగా కనిపిస్తుంది. అలాగే ఆత్మకు జన్మము లేదు ఇది అజము. దీనిలో ఉన్న ఏ వస్తువు వలననూ ఇది మలినం కాదు. కాబట్టి ఇది అద్వయము. ఉపాధుల ద్వారా వ్యక్తమయినప్పడు మాత్రమే ఇది అనేకంగా కనబడుతుంది.

శ్లో॥ బుద్ధేస్త్రిధా వృత్తి రపీహ దృశ్యతే
స్వప్నాదిభేదేన గుణత్రయాత్మనః ।
అన్యోన్యతో స్మిన్ వ్యభిచారతో మృషా
నిత్యే పరే బ్రహ్మణి కేవలే శివే ॥ 32

32. సత్వ, రజస్, తమో గుణాలనేవి త్రిగుణములు. వాటి మాయ ప్రభావానికి బుద్ధి లోబడి ఉంటుంది. తమస్సు వల్ల ఆవరణ ఏర్పడుతుంది. దీని వల్ల బుద్ధి సత్యాన్ని తెలుసుకోలేదు. ఈ ఆవరణ వల్ల మనసులో విక్షేపం కలిగి రజోగుణంగా వ్యక్తమవుతుంది.రజస్, తమోగుణాల ప్రభావం తగ్గినప్పడు, మనస్సు సత్త్వగుణంలో అంటే శాంత స్థితిలో ఉంటుంది. ఈ విధంగా జాగ్రత స్వప్న, సుషుప్తి, అవస్థలు మూడూ ఉపాధులచే అనుభవింపబడతాయి. ఇది ఆత్మను స్పృజించవు.

జాగ్రదవస్థలో ధనవంతుడు. స్వప్నంలో యాచకుని గా అనేక బాధలకు లోనుగా వచ్చు. సుషప్తిలో ఈ రెండు అనుభావాలు ఉండవు. కాని ఆత్మ త్రికాలములలోనూ, మూడు అవస్థలలోనూ ఒక్క లాగే ఉంటుంది. ఇది శరీరాతీత, పంచ కోశాతీత, అవస్థాతీ తము. శరీరాలను, కోశాలను, అవస్థలను అనాత్మగా గుర్తించి, నిరసించి శుద్ధ చైతన్య రూపమయిన, ఆనందమయమయిన స్వరూప స్థితిలో నిలచి ఉండు. ఇదే పూర్ణత్వం. బ్రహ్మణీకేవలే కేవలం బ్రహ్మంగా ఉండు.

శ్లో॥ దేహేంద్రియప్రాణ మనశ్చిదాత్మనాం
సంఘాదజస్రం పరివర్తతే ధియః।
వృత్తి స్తమోమూల తయాజ్ఞ లక్షణా
యావద్ భవేత్తావదసౌ భవేత్ భవః॥ 33

33. ఆత్మ చైతన్యం అద్వయ మయినది కావటం వలన శుద్ధ చైతన్యంలో అనేకత్వం కనిపించదు. చైతన్యానికి కళ్ళుగాని, మనోబుద్ధులు గాని లేవు. కాని చైతన్యం అంతః కరణముల ద్వారా ప్రసరించినప్పడు, ఇంద్రియాలు చూడగలుగుతాయి, మనస్సు అను భవిస్తుంది. బుద్ధి ఆలోచనల అలజడిలో నిండిపోతుంది.

విద్యుచ్ఛక్తి తనంత తానుగా వెలుతురునూ, శబ్దాన్నీ ఇవ్వలేదు. కానీ ఒక బల్బు ద్వారానో, రేడియో ద్వారానో ఇస్తుంది. అలాగే వ్యక్తమవుతుంది. ఆలోచనలు అజ్ఞానం తమస్సు నుండి ఉద్భవించి, రజోగుణంగా మనోబుద్ధులలో కదలాడతాయి.

మనస్సులో ఆలోచనలు ఉన్నంత వరకు తను సృష్టించు కున్న సుఖదుఃఖాల మయమయిన భవసాగరంలో జన్మలు ఉంటూనే ఉంటాయి. భోక్త ఉన్నంత వరకూ బాధమయ జగత్తు కూడా ఉంటుంది. వ్యక్తిత్వ భావన చైతన్యంలో కలసినప్పడే ద్వంద్వ మయ జగత్తు నుంచి విముక్తి లభిస్తుంది.

శ్లో॥ నేతి ప్రమాణేన నిరాకృతాఖో

హృదా సమాస్వాదిత చిద్ ఘనామృతః ।

త్యజేద శేషం జగదాత్త సద్రసం

పీత్వా యథాంభః ప్రజహాతి తత్ఫలమ్ ॥ 34

34. నేతి, నేతి వంటి శృతి వాక్యాలని చెప్పతున్నారిక్కడ. బాహ్యంగా కనబడే ఉపాధులేవీ ఆత్మకావని బృహదారణ్య కోపనిషత్తు చెప్తుంది. అది ఒక క్రమ విధానంలో నేతి నేతి. ఇదికాదు, ఇది కాదు అని అనాత్మను నిరసిస్తూ ఆత్మను సూచిస్తుంది. ఈ నేతి నేతి విధానంలో సాధకుడు ప్రపంచాన్ని, క్షేత్రాన్ని, ఇంద్రియాలని తను కాదని తెలుసుకుని నిర సించినప్పడు, అతని శుద్ధమైన అంతఃకరణలో ఆనందమయమైన బ్రహ్మీస్థితి అనుభూత మౌతుంది. అప్పడు నామ రూపాత్మకమయిన జగత్తును, భ్రమా కల్పనలనూ మిధ్యగా గుర్తించి త్యజించవలెను.

దాహంతో ఉన్న బాటసారి లేత కొబ్బరి బొండాం లోని నీరు తాగి, సేదదీరి, హాయిగా ఆనందంగా ఆ కొబ్బరి బొండాన్ని విసిరి వేయగలుగుతాడు. అదే విధంగా ఆనందమయమయిన ఆత్మనుభవాన్ని పొందిన తర్వాత గతంలో సుఖ దుఃఖాలను అందించిన నామరూపాలనన్నిటినీ మిధ్యాభ్రమలుగా గుర్తించి విడిచి పెట్టి, హాయిగా జీవించు.

శ్లో॥ కదాచిదాత్మా న మృతో న జాయతే

న క్షీయతే నాపి వివరతేనవః ।

నిరస్తసర్వాతిశయః సుఖాత్మకః

స్వయం ప్రభః సర్వగతో -యమద్వయః ॥ 35

35. క్రిందటి శ్లోకంలో శుద్ధ చైతన్యాన్ని మనం ప్రయత్నించి అనుభవంలోకి తెచ్చుకోవాల న్నారు. ఈ ఆత్మ ఎన్నడూ పుట్టలేదు. దీనికి పెరుగుదల లేదు. మార్పులేదు, నాశనం లేదు,

మరణం లేదు, ఇది కొత్తది కాదు. ఉపాధి గత లక్షణాలు లేవు. ఇది ఆనందమయం స్వయంజ్యోతి, సర్వవ్యాప్తం ఇది ఏకం అద్వితీయం.

ఆత్మ బుద్ధికి కూడా అతీతమైనది. కాబట్టి ఇది పరిణామ రహితం, నిత్యం.

త్రికాలంలోనూ ఒక్కలాగే ఉంటుంది. కాబట్టి అజం.

పుట్టుకే లేదు కాబట్టి పెరుగుదలలేదు. కాబట్టి నాశం లేదు.

అన్ని కాలలలోనూ ఉంటుంది కాబట్టి 'అ-నవ' సనాతనమైనది.

మూడు శరీరాలనూ, వాటి క్షేత్రాలనూ మనోబుద్ధులు కల్పించే మాయా కల్పనలుగా గుర్తించి, నేతి నేతి విధానంలో మిగిలి ఉండే అధిష్ఠానమే ఆత్మ.

ఆనందో బ్రహ్మ స్వయం ప్రభ, సర్వగతః అద్వయి ఈ పదాలన్నీ ఆత్మానుభవమనే స్వరూపస్థితిని సూచిస్తున్నాయి.

శ్లో॥ ఏవం విధే జ్ఞానమయే సుఖాత్మకే
కథం భవో దుఃఖమయః ప్రతీయతే ।
అజ్ఞానతో -ధ్యాసవశాత్ ప్రకాశతే
జ్ఞానేవిలీయేత విరోధతః క్షణాత్ ॥ 36

36. ఆత్మ నిశ్చయంగా ఆనందమయమే అయితే, ఏ విధంగా మనం ఈ బాధామయ జగత్తుని అనుభవిస్తున్నాము ? కష్టాలతో కూడిన నానాత్వమయ ప్రపంచం గోచరించటానికి కారణమేమిటి ? క్రిందటి శ్లోకంలో చెప్పినటువంటి నిత్యము, అజము, అనంతము, పరిణామ రహితము, సనాతనము, అశుద్ధ బోధ రూపము అయిన ఆత్మలో నామ రూపాలతో కూడిన బాధమయ జగత్తు ఏ విధంగా కనపడగలదు ? అజ్ఞానం ఆవరణంగా ఏర్పడగా, విక్షేపం వలన మాత్రమే ఇది ఉన్నట్లుగా కనిపిస్తుంది. జ్ఞానోదయమయిన వెంటనే అజ్ఞానం నశిస్తుంది.

బుద్ధిలో ఆవరణగాను, మనస్సులో విక్షేపం గానూ మాయాశక్తి వ్యక్తమవుతుంది. మన స్వరూపస్థితి ఈ విధంగా మరుగునపడి ఎన్నో బాధలు ఉద్భవిస్తాయి. నేను అనే అహంకారం అందులో ఒకటి. దాని నుంచి బంధము దీని నుంచి బయట పడే మార్గం జ్ఞానమార్గమొక్కటే.

శ్లో॥ యదన్యదన్యత్ర విభావ్యతే భ్రమాత్
అధ్యాసమిత్యాహురముం విపశ్చితః ।
అసర్పభూతే హి విభావనం యథా
రజ్వ్వాదికే తద్వదపీశ్వరే జగత్ ॥ 37

37. ఉన్న వస్తువుని కాక వేరొక వస్తువుగా చూడటమూ, చూసిన దానినే నిజంగా ఉందనుకోవటమూ విజ్ఞులచే అధ్యాస అని అనబడుతుంది. భ్రమవలన ఒక త్రాటిలో పాకుతున్న పామునీ దాని పడగనీ చూసినట్టే ఈ జగత్తే సత్యమని, బ్రహ్మమంటే ఇదే ననీ భావిస్తున్నాము.

ఇలా త్రాడును పాముగా చూడటాన్ని వివర్తవాదము అంటారు. ఏదైనా ఒక వస్తు వు తన సహజ స్వభావాన్ని కోల్పోకుండా, తనకంటే భిన్నమయిన అనుభవాలనివ్వటం వివర్తము. తాడు వివర్తమే పాము, బ్రహ్మం యొక్క వివర్తమే ద్వంద్వ మయమైన ఈ జగత్తు.

కొబ్బరికాయ విసిరివేసినట్లుగా జగత్తుని విసిరివేయమంటే అర్థం తాడే పామనే భ్రమని తొలగించినట్లు, జగత్తే బ్రహ్మఅనుకునే అజ్ఞానాన్ని విసర్జించమని ! వేదాంతం దేనినీ నిరసించదు.

శ్లో॥ వికల్పమాయారహితే చిదాత్మకే -
హంకార ఏష ప్రథమః ప్రకల్పితః ।
అధ్యాస ఏవాత్మని సర్వకారణే

నిరామయే బ్రహ్మణి కేవలే పరే ॥ 38

38. శుద్ధ చైతన్య రూపమయిన ఆత్మనుండి ద్వంద్వ మయ జగత్తు ఏ విధంగా ఉద్భవిం చగలదు ? ఈ శుద్ధ చైతన్యమయిన ఆత్మనుండి నేను అనే అహంకారం ఉద్భవిస్తుంది. ఈ అహంకారం మాయచే సృష్టించబడింది. ఈ అహంకారం మనశ్శరీరాలే నేను అనుకుంటుంది. అందుకే నేను చూస్తున్నాను, నేను అనుభవిస్తున్నాను, నేను ఆలోచిస్తు న్నాను అనుకుంటుంది.

ఇలా కర్తృత్వ,భోక్తృత్వభావాలతో కూడిన అహంకారం మాయాసృష్టికి తొలిమెట్టు. ఇదే మొదటి అధ్యాస. నిజం చెప్పాలంటే అహంకారం లేదు. శుద్ధమయిన ఆత్మ మాత్రమే ఉంది.

శ్లో॥ ఇచ్ఛాదిరాగాది సుఖాది ధర్మికాః

సదా ధియః సంసృతి తవః పరే ।

యస్మాత్ ప్రసుప్తౌ తద భావతః పరః

సుఖ స్వరూపేణ విభావ్యతే నః ॥ 39

39. గాఢ నిద్రలో, బుద్ధి పనిచెయ్యని స్థితిలో బుద్ధియొక్క లక్షణాలేవీ నిద్రలో ఉన్న వ్యక్తిని బాధించవు. నిద్రయొక్క ఆనందాన్ని మాత్రమే అతడనుభవిస్తాడు. లెఖ్ఖలేని కోరికలు, రాగాలు, సుఖ దుఃఖాలు మొదలైనవన్నీ బుద్ధి యొక్క స్థితులు. ఇవే సంసారానికి కార ణాలు. ఈ సంసారం పరమాత్మలో నిత్యమూ ఉన్నట్లు గోచరిస్తుంది. నిజానికి ఇవి బుద్ధికి చెందినవి మాత్రమే. గాఢనిద్ర అంటే సుషుప్తిలో అటు బుద్ధి పనిచెయ్యదు. ఇటు దాని స్థితులూ పనిచెయ్యవు. అంటే అప్పడు ఆనందమయ మయిన ఆత్మమాత్రమే అనుభ వంలో ఉంటుంది.

త్రాటి మీద ఆరోపింపబడిన పాములెలె, ఈ జగత్ భ్రమ అంతాకూడా బ్రహ్మం మీద అధ్యాస గావింపబడినది మాత్రమే. అందుకే ద్వంద్వ మయమయిన రాగం - వైరా

గ్యం, సుఖం - దుఃఖం వగైరాలను అనుభవిస్తున్నాం. సుషుప్తిలో కర్తృత్వ, భోక్తృత్వ భావాలు కూడా అదృశ్యమయిపోతాయి. ఆత్మ చైతన్య రూపంలో మన జీవితాలను అను క్షణమూ ప్రకాశింప చేస్తూ ఉంటుంది. దీనినే మనం సుషుప్తిలో ఆనందంగా భావిస్తు న్నాము. ఈ ఆనందమే ఆత్మయొక్క సహజ స్వభావము.

శ్లో॥ అనాద్య విద్యోద్భవ బుద్ధిబింబితో
జీవః ప్రకాశో - యమితీర్యతే చితః ।
ఆత్మాధియః సాక్షితయా పృథక్ స్థితః
బుద్ధ్యాపరిచ్ఛిన్న పరః స ఏవ హి ॥ 40

40. తత్త్వమసి అనే మహావాక్యంలో త్వం పదానికి వాక్యార్థము జీవుడు. దీనిని వివరి స్తున్నాడు శ్రీరామచంద్రుడీ శ్లోకంలో. సత్యాన్ని తెలియని అజ్ఞానం నుంచి బుద్ధి, బుద్ధి నుంచి ఆలోచనలు, ఆలోచనల నుంచి అహంకారం, అహంకారం నుంచి కర్తృత్వ, భోక్తృత్వ భావనలు పుడుతున్నాయి. ఆకాశంలోని సూర్యుని ప్రతిబింబం, కుండలోని నీటిలో కనబడినట్లుగా మనలో కదిలే ఆలోచనలలో ఆత్మ చైతన్యపు ప్రకాశం ప్రతిఫలి స్తుంది.

ఈ విధంగా ప్రతిబింబించిన చైతన్య ప్రకాశం చిదాభాసుడు అనబడుతుంది. ఈ చిదాభాసుడి వల్లనే బుద్ధికి తెలివి వస్తుంది. కాని ఇదే ఆత్మకాదు. నిజమయిన నేను, ఆత్మ సర్వాన్నీ సాక్షిగా చూస్తూ, బుద్ధిలోని ఆలోచనలకు శక్తినిస్తూ, వానిచే ప్రభావితం కాకుండా శాంతంగా ఉంది. బుద్ధిని ప్రకాశింపజేసే ఈ చిదాభాసుడు కేవలం సాక్షి మాత్రమే. కుండలోని నీటిలోని సూర్యుడు ఎంతగా కదిలిపోతున్నా, ఆకాశంలోని సూర్యు నికి కదిలే నీటి వలన ఎటువంటి మార్పుకలగదు. అలాగే అంతఃకరణ యొక్క ఆలోచన లతో, ఆందోళనలతో ఆత్మకి సంబంధం లేదు.

శ్లో॥ చిద్‌బింబసాక్ష్యాత్మధియాం ప్రసంగతః

త్వేకత్ర వాసాదనలాక్త లోహవత్ ।

అన్యోన్య మధ్యాసవశాత్ ప్రలీయతే

జడాజడత్వం చ చిదాత్మ చేతసోః ॥ 41

41. జడమయిన సూక్ష్మ పదార్థాలతో తయారయిన అంతః కరణ, స్వయం జ్యోతి అయిన ఆత్మ కలిసి ఉండటం వల్ల, చైతన్యవంతమైన ఆత్మతోకలిసి ఉండటం వల్ల జడమైన బుద్ధి కూడ అధ్యాసవలన చైతన్యవంతంగా కనిపిస్తుంది. మాయా ప్రభావంతో తెలివయిన అహంకారం జనిస్తుంది. ఇనుము నల్లగా, చల్లగా ఉంటుంది. కాని అగ్నిలో కొంతకాలం ఉంచితే వేడిగా, ఎఱ్ఱగా అవుతుంది. అంటే అగ్ని యొక్క లక్షణాలు ఎఱ్ఱని రంగూ,వేడి ఇనుములోనూ, ఇనుము ఆకారం అగ్నికీ ఆపాదింపబడ్డాయి.

ఇదే విధంగా బుద్ధిలోని ఆలోచనలు చైతన్యం వలన ప్రకాశం పొందగా తెలివయిన వ్యక్తిత్వ భ్రమను కలిగిస్తాయి. చైతన్యము వేరు, జడమయిన ఆలోచనలు వేరు. కాని ఈ అధ్యాస కారణంగా, 'నాఆలోచనలే నేను' అనుకుంటున్నాము.

శ్లో॥ గురోః సకాశాదపి వేదవాక్యతః

సంజాత విద్యానుభవో నిరీక్ష్యతమ్ ।

స్వాత్మాన మాత్మస్థముపాధి వర్జితం

త్యజేదశేషం జడమాత్మగోచరమ్ ॥ 42

42. ఈ శ్లోకంలో ఆత్మ విద్యనభ్యసించటంలో గల క్రమం సూచింపబడింది. గురోఃసకాశాత్ - గురు సన్నిధిలో తత్త్వమసి మొదలైన మహాకావ్యాలను వినటం (శ్రవణం) విన్నదానిని బాగా మననం చేయటం. ఆ విధంగా గ్రహించిన లక్ష్యార్థంపై దృష్టిని ఏకాగ్రతతో నిలపటం (నిధిద్యాస), ఈ క్రమంలో సాధనను కొనసాగిస్తే ఫలితంగా ఆత్మయొక్క ప్రత్యక్షానుభవం. అపరోక్షానుభూతి పొందగలడు. ఆ తరవాత ఇంద్రియ గోచరమూ, జడమూ అయిన సర్వ ప్రపంచాన్నీ అతడు త్యజించగలడు.

దేనిని మాటలలో వర్ణించలేమో, ఏది మన వ్యక్తిత్వానికంతటికీ ఆధారమో, దానిని ఆత్మస్థకమ్ హృదయంలో నిరీక్ష దర్శింపగలడు. అంటే సాధకుని హృదయంలో పరమ సత్యాన్ని దర్శించగలుగుతాడు. స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలకు భిన్నంగా ఉపాధులన్నిటికీ విలక్షణంగా ఆత్మ ప్రకాశిస్తూ ఉంటుంది. ఈ అనుభవం వచ్చాక, స్థూల ప్రపంచాన్నీ, సూక్ష్మభావనా ప్రపంచాన్నీ సాధకుడు త్యజించవచ్చు.

శ్లో॥ ప్రకాశరూపో - హ మజో -హ మద్వయః
సకృద్విభాతో -హ మతీవ నిర్మలః
విశుద్ధ విజ్ఞాన ఘనో నిరామయః
సంపూర్ణ ఆనందమయో -హమక్రియః ॥ 43

43. ఈ శ్లోకంలోని పదాలన్నీ ఉపనిషత్తుల సారములే. ఇదీ, తర్వాతి శ్లోకమూ కూడా నిధి ధ్యాసను ఎలా అవలంబించాలో నిర్దేశిస్తాయి.

నేను స్వయం జ్యోతిని, నాకు జననం లేదు. నేను వినా రెండవదేదీ లేదు. నిత్యమూ ప్రకాశిస్తూ ఉండే చెతన్యజ్యోతిని నేను. అత్యంత నిర్మలుడను. శుద్ధమయిన చైతన్య ఘనమే నేను. అనంతము, ఆనందమయము, నిష్క్రియము, పవిత్రము నా స్వభావము, పరిపూర్ణత్వమే నేను అంటున్నాడు శ్రీరామచంద్రుడు.

సాధకుడు తన దృష్టినంతటినీ ఏకాగ్రంగా కేంద్రీకరించవలసిన లక్ష్యాన్ని సూచిస్తున్న బాణం గుర్తులలాగా ఇందులో పది పదాలున్నాయి. ఈ పదీ, అనేక కోణాలనుంచి ఆత్మని వివరిస్తున్నాయి.

శ్లో॥ సదైవ ముక్తోహ -మచింత్య శక్తిమాన్
అతీంద్రియజ్ఞాన మవిక్రియాత్మకః ।
అనంతపారో -హమహర్నిశం బుధైః

విభావితో -హం హృది వేదవాదిభిః ॥ 44

44. ధ్యాన మందిరంలో సాధకుడు తన దృష్టినంతటినీ కేంద్రీకరించవలసిన లక్ష్యాన్ని సూచించే మరొక ఆరుబాణాలు గుర్తులున్నాయి. ఇంకా చెప్పాలంటే ధ్యానా భ్యాసాలు ఉన్నాయి ఇందులో.

నేను నిత్యముక్తుడను, ఈ ప్రపంచానికి ఆధారమయిన శక్తినే నేను, నన్నెవరూ బుద్ధిచే తెలుసుకోలేరు. ఇంద్రియాతీతమయిన శుద్ధ జ్ఞానమే నేను. అనంతము, అపరి చ్ఛిన్నము, అపారము నాతత్వము. వేదవిదులయిన పండితులు నిత్యమూ నన్నే ధ్యానిస్తారు అంటున్నాడు శ్రీరామచంద్రుడు.

శ్లో॥ ఏవం సదాత్మాన మఖండితాత్మనా

విచారమాణస్య విశుద్ధ భావనా ।

హన్యాదవిద్యామచిరేణ కారకై

రసాయనం యద్వదుపాసితం రుజః ॥ 45

45. కిందటి శ్లోకంలో సూచించిన దానిని అభ్యసించటం వల్ల కలిగే లాభం ఇక్కడ కని పిస్తుంది. అహం బ్రహ్మాస్మి అనే భావసాన్నిధ్యంలో సదా మనస్సును ఉంచితే, అలా ఉంచ టం వల్ల ఉదయించే విశుద్ద జ్ఞానం అవిద్యను, అజ్ఞానమును నశింపజేస్తుంది.

'అహం బ్రహ్మాస్మి' అనే ఆలోచన కొత్త ఆలోచనకాదా అనిపించవచ్చు. కాని 'అహం బ్రహ్మాస్మి' అనే వృత్తి నిజానికి వృత్తే కాదు. దివ్యమయిన ప్రత్యక్షానుభవంలో చివరగా లీన మయే వృత్తి ఇది. ఎలాగయితే ఔషధాన్ని సేవిస్తే అది రోగాన్ని నయం చేసి తాను కూడా శరీరంలో కలిసిపోతుందో, అలాగే బ్రహ్మాకార వృత్తి కూడా సాధకుని అపరోక్షానుభూతిలో లీనమయి పోయి, ఏకమూ, అద్వయమూ అయిన బ్రహ్మంగా భాసిస్తుంది.

శ్లో॥ వివిక్త ఆసీన ఉపారతేంద్రియో

వినిర్జి తాత్మా విమాంతరాశయః ।

విభావయే దేక మనన్యసాధనో

విజ్ఞాన దృక్కేవల ఆత్మ సంస్థితః॥ 46

46. సాధకులు ధ్యానంలో స్థిరంగా నిలపటానికి కావలసిన ఐదు విధానాలను ఇక్కడ వివరిస్తున్నాడు. ధ్యానానికి అర్హమయిన ప్రదేశాన్ని, సరయిన సమయాన్నీ నిర్ణయించు కోవాలి. ఇంద్రియాలని శాంతింపజేయాలి. స్థిరంగా కూర్చోటాన్ని అభ్యసించాలి. అంతకు ముందు అభ్యసించిన కర్మ, .జ్ఞాన, భక్తియోగ సాధన మార్గాలను పక్కన పెట్టి, కేవలం బ్రహ్మాకార వృత్తిలో మనస్సును నిలపటానికి కృషి చేయాలి. ఇప్పుడు ఇటువంటి అచం చల మైన మనస్సుతో, ఏకాగ్రంగా శుద్ధచైతన్యం మీద బుద్ధిని నిలపాలి.

బాహ్యాభి ముఖంగా పోయే మనస్సు యొక్క కిరణాలనన్నిటినీ సమీకరించి, అంతర్ముఖం చేసి దృష్టిని కేంద్రీకరించటం నేర్చుకోవాలి. ఆత్మ ధ్యానంలో ఆత్మలో దృష్టిని నిమగ్నం చెయ్యాలి.

శ్లో॥ విశ్వం యదేతత్పరమాత్మ దర్శనం

విలాపయేదాత్మని సర్వకారణే ।

పూర్ణశ్చిదానందమయోవతిష్ఠతే

న వేద బాహ్యం న చ కించిదాన్తరమ్ ॥ 47

47. చైతన్యమయంగా మనకు కనబడే ఈ విశ్వమంతా పరమాత్మకంటే వేరుకాదు. మన శరీరం, మనస్సు బుద్ధితో బాహ్యామైన జగత్తును, జీవుడనే మనం చూస్తున్నాము. వాటిలో గలిగే అలజడుల వల్ల బాధలననుభవిస్తున్నాం. కానీ ఈ బాధమయ జగత్తు అంతా చైతన్యపు కదలికలేననీ, చైతన్యం కంటే అవి వేరుగా లేవనీ ధ్యానసమయంలో గుర్తించమనీ శ్రీరామచంద్రుడు చెప్తున్నాడు.

అల్లకల్లోలంగా ఎగసిపడే అలలన్నీ కూడా వాటి కాధారంగా ఉండే శాంత గంభీర సాగరం కంటే వేరుగా లేవు. అలాగే ధ్యానంలో అంతరంగం ఆలోచనా రహితంగా నిశ్చ

లంగా పూర్తిగా శాంతంగా ఉంటుంది. ఈ సమాధి స్థితిలో అల్లకల్లోలంగా ఎగసిపడే ఆలోచనా తరంగాలన్నీ అదృశ్యమయి పోయి శాంత గంభీర చైతన్యంగా నిలిచి ఉంటుంది. ఇలా స్థిరంగా నిలిచి ఉన్న ఆత్మకు ఆలోచనలూ, ద్వంద్వ మయ ప్రపం చమూ, ఏమీ గోచరించవు. అంతవరకు అల్లకల్లోలంగా ఉన్న మనస్సు నిశ్చలంగా ప్రజ్ఞాన ఘనంగా నిలిచి పోతుంది. దీనినే అపరోక్షానుభూతి అంటారు.

శ్లో॥ పూర్వం సమాధేరఖిలం విచిన్తయేత్
ఓంకార మాత్రం సచరాచరం జగత్।
తదేవ వాచ్యం ప్రణవో హి వాచకో
విభావ్యతేజ్ఞాన వశాన్న బోధతః ॥ 48

48. సమాధి స్థితిలోనికి మనస్సును ఏ విధంగా తీసుకుని వెళ్ళాలో శ్రీరామచంద్రుడు ఇక్కడ వివరిస్తున్నాడు. సమాధిస్థితిని చేరేముందు, నామ రూపాత్మకమయిన చరాచర జగత్తంతా కూడా ఓంకార మాత్రమే నని ధ్యానించు. ఈ ప్రపంచానికంతటికీ ప్రణవం (ఓంకారం) శబ్దప్రతీక. ఇది ద్వైతం, అజ్ఞాన దశలో మాత్రమే కనిపిస్తుంది. జ్ఞాన దర్శనం తర్వాత కాదు.

సమాధి రెండు విధములు. సవికల్పం - ఆలోచనలతో కూడినది, నిర్వికల్పం ఆలో చనా రహితమైనది. సవికల్ప సమాధిని ధ్యానమని, నిర్వికల్ప సమాధిని నిధి ధ్యాసనమనీ అంటుంటారు.

సవికల్ప స్థితిలో - ధ్యానించేవాడు , ధ్యానము , ధ్యానలక్ష్యము అని మూడూ వేరుగా ఉంటాయి. వాటిని త్రిపుటి అంటారు.. ఈ త్రిపుటికూడా ఏకమూ, అనంతమూ అయిన ఆత్మ తత్వం లో లీనమయిపోయిన స్థితిని నిర్వికల్పస్థితి అంటారు. సమాధికి ముందుగా మనస్సుకి ఉండవలసిన ఏకాగ్రతను ధృఢం చెయ్యటానికి ఓంకారాన్ని ధ్యానించటం ఎంతగానో సహాయపడుతుంది. నిర్వికల్ప స్థితిలో వ్యక్తిత్వ భావన లీనమ

యిన తర్వాత ధ్యానంతో అవసరం లేదు. నిద్రపోవటానికి ముందు అంకెలను లెక్కపె డతావు కాని నిద్రపోయిన తర్వాత లెక్కించేదెవరు ? అంకెలెక్కడ ?

శ్లో॥ అకార సంజ్ఞః పురుషో హి విశ్వకః
హ్యుకారకస్తైజస ఈర్యతే క్రమాత్ ।
ప్రాజ్ఞో మకారః పరిపఠ్యతే -ఖిలైః
సమాధిపూర్వం న తు తత్త్వతో భవేత్ ॥ 49

49. ఓంకారంలోని అ ఉ మ అనేమూడు శబ్దాలూ మన దైనందిన జీవితంలో మనం అనుభవించే మూడవస్థలనూ సూచిస్తాయి. 'అ' కారం జాగ్రత్ పురుషునీ జాగ్రదవస్థనూ, 'ఉ' కారం తైజసునీ, స్వప్నావస్థనూ, 'మ' కారం సుషుప్తి పురుషునీ, సుషుప్తి అవస్థనూ సూచిస్తాయని మహర్షులు చెప్తున్నారు. ఈ విభేదాలన్నీ సమాధికి ముందు మాత్రమే విలువని కలిగి ఉంటాయి. సమాధి స్థితిలో ఇవి ఉండవు.

సమాధి స్థితిలో చేరుకుని ఆలోచనా, ప్రవాహం ఆగిపోయిన శాంత స్థితిలో, బాహ్య ప్రపంచం దాని సృష్టికర్త హిరణ్యగర్భుడూ, సృష్టి స్థితి లయ కారకుడైన జగదీ శుడూ మొదలైన తేడాలుండవు. అండపిండ బ్రహ్మాండ విభేదాలు ఉండవు. సర్వసృష్టికి ఆధారమయిన ఒకే ఒక చైతన్యం ఉంటుంది.

శ్లో॥ విశ్వం త్వకారం పురుషం విలాపయే
దుకార మధ్యే బహుధా వ్యవస్థితమ్ ।
తతో మకారే ప్రవిలాప్య తైజసం
ద్వితీయ వర్ణం ప్రణవస్య చాన్తియే ॥ 50

50. ఓంకారోపాసనలో క్రమంగా ధ్యానంలో ఏవిధంగా మనకు కనపడే చరాచర జగత్తు నంతా విలీనం చేయవచ్చునో ఈ శ్లోకంలోనూ, తరువాతి శ్లోకంలోనూ శ్రీరామ చంద్రుడు వివరించాడు. ఓంకారరోని 'అ' కారం విశ్వునిగా అనేక విధముల (విరాట్

స్వరూపంగా) వ్యక్తమవుతుంది. దీనిని తైజసునికీ, స్వప్న ప్రపంచానికీ (హిరణ్య గర్భునికీ) ప్రతీక అయిన ఉ కారంలో విలీనం చెయ్యాలి. చివరగా 'ఉ' కారాన్ని మూడవ శబ్దమైన ' మ' కారంలో విలీనం చేయాలి.

ఈ విధానాన్ని ఉపాసన అంటారు. అత్యల్పమైన వస్తువులో మహోన్నత లక్ష్యాన్ని చూడటమన్నమాట. ఉదాహరణకి ఒక రాతి బొమ్మలో మహా శివుని ఆపాదించటం. ఆత్మనివ్యష్టిగా చూస్తే విశ్వుడు అనే నేను జాగ్రత్ పురుషుడు. ఇది స్థూల శరీరం. సమిష్టిగా చూస్తే భగవంతుడు - విరాట్ పురుషుడు. మొత్తం స్థూల శరీరాలు ఈ స్థితిలో వ్యక్తమవుతాయి. ఇవి అన్నీ 'అ' కారంలో వ్యక్తమవుతుంది. వీటిని 'ఉ' కారంలో విలీనం చెయ్యాలి. అంటే వ్యష్టిగా తైజసుడు. స్వప్నపురుషుడు అంటే సూక్ష్మశరీరంలో విలీనం చెయ్యాలి. సమిష్టిగా చూస్తే భగవంతుడు - హిరణ్యగర్భుడు. మొత్తం సూక్ష్మ శరీరాల సృష్టి కర్తలో విలీనం చేయాలి. ఇప్పుడు ఈ రెండింటినీ మ కారంలో  కారణ తత్త్వంలో విలీనం చేయాలి. అంటే వ్యష్టిగా ప్రాజ్ఞుడైన సుషుప్తి పురుషుడిలో, సమిష్టిగా మొత్తం కారణ శరీరాలకి మూల కారకుడైన ఈశ్వరుడిలో విలీనం చేయాలి.

శ్లో॥ మకారమప్యాత్మని చిద్ ఘనే పరే
విలాపయేత్ ప్రాజ్ఞమపీహ కారణమ్।
సో -హం పరం బ్రహ్మ సదా విముక్తిమత్
విజ్ఞాన దృగ్ ముక్త ఉపాధితో -మలః ॥ 51

51. స్థూల, సూక్ష్మాలు రెండింటినీ కారణ తత్త్వంలో విలీనం చేసిన తర్వాత వానిని కూడా పరబ్రహ్మ తత్వంలో విలీనం చేయాలంటున్నాడు శ్రీరామచంద్రుడు. అంత వరకూ నేను విశ్వుడిని, తైజసుడిని, ప్రాజ్ఞుడిని అనుకుంటున్న అహంకారం ఇప్పుడు పరబ్రహ్మ తత్వంలో లీనమయి సర్వానికీ ఆధారమయిన చైతన్యమే నేను అనే భావంలో

నిలుస్తుంది. బ్రహ్మతత్త్వంలో లీనమయిన తర్వాత సాధకుడిని, ఉపాధులు పరిమితం చెయ్యజాలవు.

ఈ శుద్ధ చైతన్య స్థితిలో అవిద్యకానీ, తత్ ఫలమయిన ద్వైత ప్రతీతి కాని ఉండ లేవు. ఇది అమల : నిష్కళంకమైనది. గుణాతీత :- గుణముల కతీతమైనది. ఓంకారో పాసన ఫలించిన తరుణంలో సోహం పరబ్రహ్మ - నేనే ఆ పరబ్రహ్మాన్ని విజ్ఞాన దృగ్ - సమస్త జ్ఞానాన్ని తెలుసుకునే విజ్ఞాన చక్షువు నేనే అనే అనుభవంలో సాధకుడు నిలవ డాన్ని సూచించే అనుభవ వాక్కులివి.

శ్లో॥ ఏవం సదా జాతపరాత్మభావనః
స్వానందతుష్టః పరివిస్మృతాఖిలః ।
ఆస్తే న నిత్యాత్మ సుఖప్రకాశకః
సాక్షాద్విముక్తో -చల వారి సిన్ధువత్ ॥ 52

52. ఆత్మసాక్షాత్కారము యొక్క ఫలితాన్ని వీలయినంత వివరంగా లక్ష్మణులకు చెప్పాలన్న తపన కనిపిస్తుంది. ఆత్మ తత్వాన్ని గ్రహించి ఆత్మలో పూర్తిగా తాదాత్మ్యం చెందినవానిలో ఆవరణ విక్షేపాలతోకూడిన అఖిల జగత్తుక్షణంలో అదృశ్యమయిపోతుంది.వాటి జ్ఞాపకాలు కూడా అతడి దరిచేరలేవు. విముక్తి నంది అచలమైన మహాసముద్రం వలె ఉంటాడు.

పెద్ద అలలతో హోరుమనే శబ్దంతో అల్లకల్లోలంగా ఉన్న మహాసముద్రం ఏదో అద్భుతం జరిగి నిశ్చలంగా మారిపోతే ఎంత ఆశ్చర్యనందానుభూతీ, అలౌకిక సౌందర్య భావనా కలుగుతాయో, ఆత్మ సాక్షాత్కారం పొందిన సాధకునికి కూడా అంతే ఆశ్చర్యానం దానుభూతి, అలౌకిక సౌందర్య భావనా కలుగుతాయి.

శ్లో॥ ఏవం సదాభ్యస్త సమాధి యోగినః
నివృత్త సర్వేన్ద్రియగోచరస్య హి ।
వినిర్జి తా శే షరిపోరహం సదా

